

# బాలబోధ

[ అను సంక్షిప్త పరిహాస్యబోధ నాటిక ]


రచయిత:

యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు B.A., B.L.,

నరసాపురం




వెల : 6-50



Dr. K. Dayananda Swamy



# బాలబోధ

[ అను సంక్షిప్త పరిపూర్ణ బోధ నాటిక ]


రచయిత:

యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు B.A., B.L.,

నరసాపురం




వెల : 6-50



తృతీయ ముద్రణ - 1992

# మనవి

పలువురి పాఠకులు కోరిక మేరకు గురువుగారు శ్రీ యిలప
ర్తి వీరవెంకట రామచంద్రరావుగారు రచించిన
ఈ బాలలబోధ గ్రంథాన్ని తృతీయ ముద్రణ జరి
గింది గురువుగారి అన్ని గ్రంథాలను ఎంతగానో
ఆదరిస్తున్న సోదరీ సోదరులకు నా హృదయ
పూర్వక నమస్కారములు తెలియజేస్తూ

నర్సాపురం భక్తమండలి తరపున
మంచిరాజు శ్రీనివాసమూర్తి
విజయవాడ.

ముద్రణ :
శ్రీ వెంకటరమణ ముద్రణాలయము,
నరసాపురం

శ్రీ గురుభ్యోనమః

# గ్రంథకర్త తొలిపలుకులు

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణుర్గురుదేవో మహేశ్వరః
గురుసాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురువేనమః

1970, 1971 సంవత్సరములలో యీ చిన్ని పొత్తము నా సంపాదకత్వమున వెలువడిన రాజయోగి వేదాంత మాస పత్రికలలో ప్రతినెల భాగములుగా ముముక్షువులకు యీ గ్రంథము మిక్కిలి తోడ్పడుననీ, గ్రంథరూపమున వెలువర్చిన శాశ్వతముగా నుండుననీ, మిత్రులు, భక్తులు ప్రోత్సహించిన కారణమున యిప్పుడీ గ్రంథమును ప్రకటించుచున్నాను. రంగ స్థలిపై, నా ఆత్మీయ సోదరులు శ్రీ జంగా లక్ష్మినరసయ్య గారు (ఖమ్మం) దీనిని ప్రదర్శింపచేసి ప్రేక్షకుల కానందము కలిగించితిమని నాతో చెప్పియుండుటచే యీ గ్రంథమునకు "సంక్షిప్త పరిపూర్ణబోధ" నాటిక అను నామాంతరము నుంచడమైనది.

ఇందు మొదటిరంగమును "బొమ్మలకొలువు" అను పేరుతో విజయవాడ కాపురస్థులు, కె. బి. యస్, కాలేజి హిందీ లెక్చరరు శ్రీ B. V. S. S. సత్యనారాయణ.M. A. గారు పత్రికలో ప్రకటించవలసినదిగా కోరి పంపిన వ్యాసములోనుండి గైకొని యీ నాటికకు నాందీ ప్రస్తావనగా యుండుటకు తగిన రీతిగా ప్రథమ రంగముగా రూపొందించడమైనది. వారికి యిందు మూలముగా నా కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాము.

ఈ గ్రంథ ప్రథమ ముద్రణావ్యయమునకుగాను ప్రస్తుతం, విశాఖపట్నంలో మిలిటరీ యింజనీరుగా ఉద్యోగంలోనున్న, మల్లంపల్లి సుభద్రా సుబ్బారావు పుణ్యదంపతుల జ్యేష్ఠపుత్రుడు చిరంజీవి మల్లంపల్లి వీరభద్రరావుగారిచే షుమారు 5 సం॥ల క్రితమే రూ. 500/-లు సమర్పింపబడినవి. కాని 4 సం॥లపాటు నేను వ్యాధిగ్రస్తుడనై యుండుటచే గ్రంథముద్రణ కొనసాగలేదు. ఇపుడు కాగితము ఖరీదు. ముద్రణా వ్యయము కూడ విపరీతముగా పెరిగినవి. మిగతా వ్యయమునంతయూ తాను భరింతునని ప్రస్తుతం విజయవాడ కాపురస్తులు సుభద్రా శ్రీరామమూర్తి పుణ్యదంపతుల ద్వితీయపుత్రరత్నము చిరంజీవి, మంచిరాజు శ్రీనివాసమూర్తి వాగ్దానము చేయుటయేగాక, తన పర్యవేక్షణక్రింద తొలి మలి ముద్రణ చేయించు భారముకూడా తనే స్వీకరించినాడు. యీ చిరంజీవులిద్దరూ నావల్ల పరిపూర్ణ బోధోపదేశము పొందు చక్కగా బోధనా కళింపు చేసుకున్నారు. ఇందు శ్రీనివాసమూర్తి బోధాధికారి కూడనై "విజ్ఞానానంద" బిరుదాంకితుడై యీ పరిపూర్ణ బోధను ప్రచారము చేయుచున్నాడు. వీరిద్దరకూ, గురు పరమాత్మ కృపా విశేషముచే సర్వ శుభములున్నూ భ్రాంతిరహిత స్థితియున్నూ కలిగి శాశ్వతపునర్జన్మ రాహిత్యము సిద్ధించుగాకయని ఆశీర్వదించుచున్నాను.

ఇట్లు

గ్రంథకర్త

యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు

నర్సాపురం

1-3-1980

# కృతి సమర్పణము

## పద్యకుసుమాంజలి - చతుర్థపుష్పము

ఆ॥ వే॥ విద్యకంటె, బ్రహ్మవిద్యకంటెను, వారి
కంబుకంటె గూడ కఠినమై, య
గోచరంబు నగుచు, గురుగోప్యమై యొప్పు
పూర్ణబోధనిందు పొందుపరచి

మంజరి : ఈ చిన్ని పాత్రంబు నీ పూజకొరకు
వ్రాసి రేకులు విడదీసి తిన్మున్న,
తిరిగి వానిని చేర్చి దివ్యప్రసూన
పరిమళ శ్రీలు గుబాళింపజేసి

నీ పాద పూజార్థమీ పూవునిడితి
స్వీకరింపుము దేవశ్రీ దయానంద
పొన్నాల రాజేంద్ర పూర్ణయోగీంద్ర
విజ్ఞాన ఘనసాంద్ర విబుధామరేంద్ర !



శ్రీ గురుభ్యోనమః

# బాలబోధ

## (మొదటి రంగము)

ప్రవేశము : (వీధిలో) బొమ్మలవాడు : బొమ్మలోయమ్మ! బొమ్మలు! దొరబొమ్మలు, దొరసాని బొమ్మలు, దేవుడి బొమ్మలు, పక్షుల బొమ్మలు, జంతువుల బొమ్మలు, రకరకాల బొమ్మలు.

పాప : (ప్రవేశించి); అమ్మో ! నీ బండిలో ఎంత అందంగా పేర్చావు !

బొ : బొమ్మలకొలువు ఇలా పేర్చరు. మెట్లుమెట్లుగా పేర్చాలి. క్రింద మెట్టులో రకరకాల చెట్లు ఉండాలి. ఆతర్వాత మెట్టుమీద తిమింగళము, మొసలి, చేప, కప్ప యిలా నీటిలో తిరిగే జంతువుల బొమ్మలు పెట్టాలి. తర్వాత మెట్టుమీద నెమలి, చిలుక, కాకి, గ్రద్ద, కొంగ, హంస లాంటి పక్షి బొమ్మలు పెట్టాలి. ఆ తర్వాత సింహము, ఏనుగు, గుఱ్ఱము లాంటి భూమిమీద తిరిగే బొమ్మలు పెట్టాలి.

పాప : మరి తాతా ! దేవుడి బొమ్మలు ఎక్కడ పెట్టాలి! మనుష్యుల బొమ్మలు ఎక్కడ పెట్టాలి ?

తా : ఇవన్నీ పెట్టాక మనుష్యుల బొమ్మలు పెట్టాలి. ఎందుకంటే మానవజన్మ ఎత్తడానికిముందు క్రిందమెట్లమీది

బొమ్మల్లాంటి ఎనుబది నాల్గులక్షల జీవరాసుల జన్మలు ఎత్తాలి. మనుష్యుల బొమ్మల్ని పెట్టేక దేవుడి బొమ్మలు పెట్టాలి.

పా : తాతా! ఆ బొమ్మకి చెవుల్లేవేం?

బో : అవును అచ్చుగుద్దుతుంటే సరిగా పడలేదు. దేవుని దృష్టికే లోపం ఉంది తల్లీ. ఒకనికి రూపం అంతా యిస్తాడు కాని మాటఉండదు. దేవునిదృష్టిలో అందరూ సమానమే అయినా (ఒకణ్ణి బాగా సృష్టిస్తాడు. అయితే యింకొకడికి) కన్నో, కాలో, చెయ్యోలేకుండ సృష్టిస్తాడు. ఒకణ్ణి ధనవంతుని ఇంట్లోను. మరొకణ్ణి దరిద్రుని యింట్లోను సృష్టిస్తాడు. ఎవడు చేసుకొన్న కర్మను సారం వానికి లభిస్తూవుంటాయి.

పా : తాతా! మరి దేవుడు ఒకడే అంటారేం ఇన్ని దేవుళ్ళున్నా రేమిటి తాతా!

బొ : మంచి ప్రశ్న వేశావు, నేను చెప్పేది జాగ్రత్తగా విను. లేకపోతే అర్థంకాదు. పూర్వం ఇన్ని రకాల దేవుళ్ళు లేరమ్మా అసలు అపుడు దేవుడికి ఆకారంలేదు. మన వేదాల్లోవున్నట్టుగా పంచభూతాల్ని (అంటే ఆకాశము వాయువు, అగ్ని, నీరు, భూమి) సూర్యుణ్ణి, చంద్రుణ్ణి మొదలుగు వారిని ప్రార్థించేవారు. ఆతరువాత పాముల్ని చెట్లని పూజించేవారు. కొన్నాళ్ళు పోయాక భూమి మీద కొంతమంది దుర్మార్గులుచేరి ప్రజలను బాధిస్తూవుంటే వీళ్ళ బారినుండి రక్షించిన రాముడు, కృష్ణుడు మొదలగువారిని ప్రజలు తమ దైవమని తలంచి వాళ్లనే

ఆరాధిస్తూ ఉండేవారు. అలాగే ప్రజల్ని మంచి మార్గంలో పెట్టడానికి కొంతమంది కొన్ని మతములను స్థాపించి ఆ సిద్ధాంతములను ప్రజలకు బోధించేవారు. క్రమక్రమముగా కొందరికి గుళ్ళుకట్టించి వారి విగ్రహములను ఆగుడిలో ప్రతిష్ఠించేవారు. ఈవిధముగా ఇప్పుడు అనేక దేవుళ్లు తయారైనారమ్మా.

పా : తాతా! అయితే వీరిలో నిజమైన దేవుడు ఎవరు?

బో : అమ్మా! ముందే చెప్పానుకదా దేవుడికి ఆకారంలేదని కంటికి కనిపించేదంత ఎప్పుడో ఒకప్పుడు కనబడకుండా పోతుంది. అందుచేత ఆకారంవున్న వస్తువేదైనా. దేవుడు కాదు. నిజమైన దేవుడి గురించి చెప్పేవారే గురువులు. దేవుడి గురించి బోధించేవారు దేవుడితో సమానమే. వీరే చెప్పకపోతే మనకు దేవునిగురించి తెలియదుగా.

పా : మా బాగా చెప్పావు తాతా! మా బడిలో మేష్టారు కూడా యిలా చెప్పరు. నువ్వు చెప్పినట్లు పేరుస్తాను. యివిగో డబ్బులు. వచ్చేవారమే దసరా, ఆ రోజున వచ్చి నేను పేర్చిన బొమ్మల్ని చూచి ఎలా పేర్చానో చెప్పుదువుగాని, ఏం వస్తావు కదూ! నా సందేహాలు బోలెడున్నాయి. అప్పుడు చెప్పాలి సుమా!

బో : అలాగే తల్లీ తప్పకుండా వస్తాను. ఇదిగో బొమ్మలు చక్కగా పేర్చు మరి.

నిష్క్రమింతురు.

# బాలబోధ

## (రెండవ రంగము)

పాప: రా తాతా! రా! మా బొమ్మల కొలువు చూచి బాగావుందో లేదో చెప్పాదువుగాని.

తా: (వచ్చిచూచి) బాగావుందమ్మా నేను చెప్పినట్లే పేర్చినావులే!

పా: కూర్చో తాతా! నేనడిగినవన్నీ చెబుతానన్నావుగా మరి దేవుణ్ణి గురించి గురువు చెప్పందే మనకు తెలియదన్నావుగదా! గురువునకెట్లా తెలిసింది తాతా?

తా: తన గురువు దేవుణ్ణి తనకు చూపిస్తే ఆయన చూచినాడమ్మా! అందుచేత ఆయన చెప్పగలడు తల్లీ!

పా: తాతా! దేవునికి ఆకారం, రూపం లేదన్నావుగదా! ఆ దేవుణ్ణి అసలు చూచుట ఎల్లాగు?

తా: పరిశుద్ధాంతఃకరణగలవారి మనస్సు స్వచ్ఛంగా అద్దములాగా వుంటుందమ్మా. ఆ మనస్సునకు గోచరిస్తుందన్నమాట.

పా: రూపమే లేనిదెట్లా గోచరిస్తుంది తాతా?

తా: మనస్సు ఏ రూపమైనా ధరిస్తుంది. మైనంచేత ఏ ఆకారమైనా కల్పించినట్లే!

పా: అర్థంకాలేదు. రూపమే లేదంటావే! మరి ఏ రూపం లేనిదే ఏ రూపంలో గోచరిస్తుంది?

తా : గురువు, శ్రీతిముక్తి అనుభవములచే ఆదేవునిరూపముసు మనస్సునకు తోపింపచేస్తాడు. శిష్యునియొక్క శుద్ధ మనస్సు ఏకాగ్రమై ఆ రూపరహితమైన దానిని గ్రహించును.

పా : రూపంలేని దానిని ఎల్లా తోపింపచేస్తాడు?

తా : రూపం లేకపోవుటే దాని స్వరూపము.

పా : అయితే అపుడు గ్రహించేమనస్సుగూడా రూపంలేకుండా పోవాలిగా! మనస్సు అరూపం వహిస్తుందన్నావుగా మరి

తా : శహాభాష్! బాగా గ్రహించేవమ్మా! మనస్సపుడు తన రూపం కోల్పోతుంది.

పా : మనస్సు ఆ రూపము వహిస్తే యింక మనిషి ఎల్లా జీవితం గడుపుతాడు?

తా : ఆ అరూపస్థితి (అమనస్క స్థితి) ఎంతో సేపుండదమ్మా మళ్ళీ మామూలుగా అన్ని విషయాలు తెలుసుకొంటుందిలే!

పా : ఏమిటా విషయాలు? వానినెల్లా గ్రహిస్తుంది?

తా : చెవులద్వారా శబ్దము, చర్మముద్వారా స్పర్శ, కంటిద్వారా రూపం, నాలుకతో రుచి, ముక్కుతో వాసన గ్రహిస్తుంది.

పా : మనస్సు అరూపం వహించడమంటే వీనిని గ్రహించి వుండడమేనా?

తా : ఎంతబాగా తెలుసుకొన్నావమ్మా తల్లీ

పా : అయితే మనస్సు ఆరూపం చెంది తెలుసుకొనే దేవుడు రూపం లేని వాడంటే ఈ శబ్దం వగైరాలు ఆ దేవుని యందు లేవా!

తా : వున్నాయిగాని, ప్రపంచంలో వెలియబడేటంత స్థూల రూపంగా లేవు సూక్ష్మంగా మర్రిగింజలో మర్రి వృక్షమంతటా దాగివున్నట్లే దాగివున్నాయి.

పా : అట్లయితే దానిని కేవలం నిరాకారం అనడం ఎలాగు? మర్రివిత్తనంలో చెట్టు కనబడలేదుగాని ఆ విత్తనంలో నుంచే ఆ చెట్టు వస్తూంది.

తా : అవునుతల్లీ! అట్లాగే నిరాకారంగావున్న ఆ దేవుడు, ఆకారం వహిస్తున్నాడు. ఈ ప్రపంచంగా అవుచున్నాడు.

పా : అయితే దేవుడు ఒకప్పుడు నిరాకారంగానూ ఒకప్పుడు ఆధారాలతోను వున్నాడన్నమాట! అసలు దేవున కెప్పుడూ ఏ ఆకారము లేదన్నావే!

తా : అవునమ్మా. ఆ అసలు దేవుడు మాటకూ మనస్సుకూ కూడ అందడమ్మా!

పా : ఆ దేవుడే నాకు కావాలి. ఆ దేవుణ్ణి గురించి చెప్పుతావా?

తా : మళ్ళీ మాటు చెపుతానులే యిక పోవాలి.

(అని నిష్క్రమించును)

# బాలలబోధ

## (మూడవ రంగము)

పా ; ఏమండోయి తాతగారూ నమస్కారం రండి యిటు రాకుండా వెళ్ళిపోవుచున్నారే!

తా ; (వచ్చి) యిదేమిటమ్మాయ్! నాకు నమస్కారం చేస్తున్నావు! నీవు పెద్దింటి బ్రాహ్మణ పిల్లవు నేనుశూద్రోణ్ణి

పా ; అట్లా కాదు తాతగారూ! మీరు దేవుణ్ణి గురించి చెప్తుతున్నారు. కనుక దేవునితో సమానమే. దేవుణ్ణిచూచి చెప్పువాడే గురువని మీరే అన్నారుగదా మీరు గురువులు కాని సామాన్యులుగారు.

తా ; వేయి వరహాల మాటలన్నావమ్మా!

పా ; మరి చెప్పండి తాతగారూ! మాటకూ మనస్సులకూ అందని ఆ దేవుణ్ణి గురించి

తా ; ఏం చెప్పను తల్లీ! ఆ దేవునివల్ల నీకేంప్రయోజనం తల్లీ! ఆ దేవునివల్ల నీకే కోరికలు సిద్ధిస్తాయి?

పా ; తాతగారూ నాకేమున్నా కోరికలుంటేగా!

తా ; ఏకోరికలూ లేనపుడు ఈ అడగటం వినటం దేనికమ్మా!

పా ; ఏమోనండి తాతగారూ, నే చెప్పలేనండీ, ఎదురుగా కానవచ్చేదంతా తెలుస్తోనేవుండి. ఈకానవచ్చేదానిని పుట్టించేవాడు ఒకడుండాలని తెలుస్తూనేవుంది. మేము మట్టితో బొమ్మలుచేస్తాము. బాగుండకపోతే మళ్ళీమట్టి

వుండగా మార్చి యింకో బొమ్మ చేసుకొంటాం, అదీ బాగుండకపోతే ఆ మట్టి నేమార్చి మరొకదాన్ని చేస్తాము నిజంగా ఆ మట్టికే తెలివుంటే మేముపెట్టే బాధలకు ఎంత క్షోభపడుతుందో! యీ ప్రాణులన్నిటికీ తెలివుంది గదా! యివి ఆ సృష్టికర్త చేతుల్లోపడి క్షోభపడవా? పడుచునే వున్నాయి కూడాను. కనుక అసలు పుట్టకుండా నేవుంటే యెంత బావుంటుంది. తాతగారూ!

తా ; ఇన్ని కబుర్లెక్కడ నేర్చినావమ్మా! నిండా పదేళ్ళైనా లేవే!

పా ; ఎక్కడా నేర్వలేదండి. ఏమిటో లోపలనుంచి ఒక ఆవేదనతో యీ ఊహాలన్నీ వాటికవే తోస్తున్నాయండి.

తా ; అదేనమ్మా పూర్వజన్మ సంస్కారమంటే.

పా ; ఆ పూర్వ సంస్కారాలు ఎక్కడ దాక్కొనివున్నాయి తాతగారూ.

తా ; అంతఃకరణ (అనగా నీ మనస్సు) యందేవున్నాయి.

పా ; ఐయితే యిదివరకు జన్మలలో నుండే అంతఃకరణే యీ జన్మలో కూడా వచ్చిందంటారా?

తా ; అవును తల్లీ! అంతఃకరణ మార్పుచెందదు, అదే ఒక దేహాన్ని విడిచి వేరొక దేహాన్ని గ్రహిస్తూవుంటుంది.

పా ; అట్లాఐతే ఆ అంతఃకరణ లేకుండాచేస్తే యిక జన్మ ఎత్తేదే వుండదన్నమాట!

తా ; శెహబాష్ బాగా గ్రహించినావమ్మా!

పా ; ఆ అంతఃకరణ యెట్లా పోతుందో చెప్పండీ తాతగారూ

తా ; అది గురువు శిష్యునికి చెప్పే గురుగోప్యమమ్మా!

పా ; ఐతే మీరే నాకు గురువులు. నేను మీకు శిష్యురాలను నాకు ఉపదేశం చేయండి స్వామీ; (అని పాదాల నంటి నమస్కరించును.)

తా ; చాల్లే అమ్మా! ఎవరేనా చూస్తే నిన్నూ నన్నూ కూడా చీవాట్లు పెడతారు.

పా : ఏం ఎందుకు పెడతారు? ఏం తప్పు చేసేనని తిడతారు? నా గురువుకు నేను నమస్కారం చేసుకుంటే వారికేం?

తా : నేను నీకు గురువుగా వుండు అర్హత వుండవద్దా తల్లీ? నాయందు సద్గురు లక్షణములున్నాయని నీవు తృప్తి పడాలిగదా.

పా : సద్గురు లక్షణాలేవీ? అవన్నీ నాకు తెలియవు మీయందు నాకు దేవునియందువలె భక్తి పొంగుచున్నది. నేను శిష్యురాలుగా వుండుటకు తగనేమోనని మీయందు నాకెట్టి లోపము గోచరించుటలేదు.

తా : ఆ గురుశిష్య లక్షణములేమో యీ మారు చెబుతానులే తల్లీ.

పా : తప్పక వచ్చి అనుగ్రహించాలి స్వామీ!

(అని చెమర్చిన కళ్ళతో నమస్కరించును)

# బాలబోధ

## (నాలుగవ రంగము)

పా : స్వామీ! రండి, రండి, అనుగ్రహముంచి చెప్పినవిధంగా వచ్చారు. నమస్కారం (అని పాదాభివందనం చేయును)

తా : శుద్ధ చిత్తోభవ! ఏమి చేయుమంటావు తల్లీ! నీ పవిత్రాంతఃకరణమే నన్నిలా లాక్కొచ్చిందమ్మా.

పా : అంతఃకరణ ఎట్లా లాక్కొస్తుంది స్వామీ?

తా : అందరి అంతఃకరణములూ కలసి ఏక అంతఃకరణంగా అఖండంగా కలసేవున్నాయమ్మా ఒక పరిశుద్ధాంతఃకరణ యందు బలీయమగు ఒక సంకల్పం కలిగిందంటే దాని ప్రతిస్పందనము తప్పక కల్గి పనిచేస్తుంది తల్లీ!

పా : నా సంకల్ప బలంచేత మీ అంతఃకరణలోనే ప్రతిస్పందనము ఎందుకు కలగాలి? యెన్నో అంతఃకరణాలుంటే?

తా : ఎంత గుంపువున్నా అందెవరిని పేరెట్టి పిలిస్తే వాళ్ళే పలుకుతారుగదా! టెలిఫోనులో ఏ నెంబరు త్రిప్పితే ఆ నెంబరునుంచే జవాబు వస్తోన్నట్లే.

పా : స్వామీ! యిక్కడ మరో సందేహం, అన్ని అంతఃకరణాలూ కలసి అఖండంగా వున్నాయన్నారు. మళ్ళీ పవిత్రాంతఃకరణమని విడదీసి మాట్లాడుతున్నారే! పరిశుద్ధాంతఃకరణాలూ మలిన అంతఃకరణాలూ రెండూ ఎట్లు అఖండంగా కలసి వుంటాయి తండ్రీ?

శ్రా : ఆదేనమ్మా స్వగత భేదమంటాను. ఆకాశమంతటా ఒకటిగా కలసివున్నా, పాత్రలలోని ఆకాశము, యిళ్ళలోని ఆకాశము వేరుగానున్నట్లు తోచబడుటలేదు. బయటనున్న వానిమాట బయటనున్న వానికి బాగా వినిపిస్తుంది. గోడలమధ్య పెట్టెలో ఒకనిని మూసివేస్తే వానికి ఆ శబ్దం వినబడనట్లే.

పా : ఓహో పవిత్రాంతఃకరణ యందలి సంకల్పము మరొక పవిత్రాంతఃకరణమందు స్పందనము కలిగిస్తుందేగాని మలినాంతఃకరణము నందు ప్రతిస్పందనము కల్గింప చాలదన్నమాట.

శ్రా : బాగా గుర్తించేవు! చెరువులో ఒక చిన్న రాయివేస్తే పుట్టిన కెరటాలు వలయాకారంగా నీరున్నంతవరకూ వ్యాపిస్తాయి కాని మధ్యమధ్యనున్న దీవులలోనికెక్కవుగదా!

పా : బాగా అర్థమయినది తండ్రీ! మరి గురుశిష్యుల శిక్షణలెట్లుండవలెనో యీసారి సెలవిస్తానన్నారు చెబుతారా స్వామీ!

శ్రా : అవునమ్మా అవును. గురుశిష్యులిద్దరకు ప్రధానంగా మనం చెప్పుకొన్న శుద్ధాంతఃకరణముండాలి తల్లీ!

పా : ఐతే స్వామీ నాకు పవిత్రాంతఃకరణములేదా ఏమి? (అని కన్నులు చెమ్మగిల్లగా దీనముగా జూచుచుండును)

శ్రా : (కరుణామృత దృష్టితో) ఏమమ్మా అట్లా బాధపడతావు నీ అంతఃకరణ మహా పరిశుద్ధము కాకపోతే, అసలు ఈ జిజ్ఞాస నీ కెందుకు కలుగుతుందమ్మా!

పా : మరైతే - "శుద్ధచిత్తో భవ" అని నన్నెందుకు ఆశీర్వదించినారు? నాకు చిత్తమాలిన్యముండబట్టె అలా ఆశీర్వదించినారేమో ననుకొన్నాను.

శా : (చిరునవ్వుతో) అదా! అసంభావన, సంశయము విపరీతభావన శిష్యుని అంతఃకరణమందు పొడచూప కుండుటకై గురువు శిష్యుని ఆశీర్వదించు పద్ధతమ్మా అది!

పా : (వికసించిన ముఖంతో) అమ్మయ్య! ధన్యోస్మి! అయితే నన్ను తమ శిష్యురాలిగా స్వీకరించి నట్టేనన్నమాట.

శా : అయితేమరి నా యందు గురువుగానుండుటకు తగిన అర్హత వుందో లేదో!

పా : అయ్యో లేకేమి? నా ఆవేదనకు తమ అంతఃకరణం స్పందించి తమరినిటకు లాక్కొచ్చిందిగదా! తమరిది మరి పవిత్రాంతఃకరణము కాబట్టే నా సంకల్పమునకు ప్రీతిగా స్పందించింది?

శా : అసాధ్యురాలవు తల్లీ! మరి యితర లక్షణాలు కూడా వుండాలిగదా!

పా : అవియేమో సెలవీయండి స్వామీ!

శా : భక్తిజ్ఞాన వైరాగ్యములు మూడుగలవాడే గురువు మరిన్ని తాను తరించి యితరులను తరింపచేసేవాడుగా వుండాలి.

పా : భజనచేసినవారిని భక్తులు అంటారుగదా! గురువు అట్టి భజన పరుడై వుండాలా!

తా : దేవునియందు ప్రేమావుండాలి భయమూ వుండాలి రెండూవున్న వాడే భక్తుడు. భజన చేసేవారంతా భక్తులుగారు.

పా : భయమెందుకుండాలి స్వామీ!

తా : దైవ శాసనము ననుసరించి జీవించకపోతే దేవునికి కోపంవచ్చి శిక్షిస్తాడేమోనని భయమువుండవద్దా?

పా : గురువు కూడా మహాపరిశుద్ధాచరణ గలవాడై వుండాలి అన్నమాట.

తా : అవును తల్లీ. తానే ఆచరించకపోతే తన శిష్యులాచరిస్తారా? కనుక నే ఆచరించి చూపినవాడే ఆచార్యుడు అన్నారు.

పా : మరి జ్ఞానమంటే బోలెడు పుస్తకాలు చదివివుండాలి కాబోలు.

తా : కాదమ్మా శాస్త్రజ్ఞానం. జ్ఞానంకాదు. ఏది తెలుసుకొంటే సర్వమూ తెలుసుకొన్నట్లవుతుందో అదే జ్ఞానం. అదే అన్ని చదువులయొక్క మర్మము.

పా : ఆ వస్తువేమిటో నాకు చెప్పరూ స్వామీ!

తా : తన్ను తాను తెలుసుకొంటే సర్వమూ తెలియబడ తాయి. తానే ఆత్మ. అట్టి ఆత్మయొక్క స్వరూప జ్ఞానమే జ్ఞానము.

పా : అయ్యా! తమరు చెప్పేవన్నీ క్రొత్తగానే వున్నాయి! మరి వైరాగ్యమంటే సన్యాసమేనా? వేరొకటా?

తా : కాదమ్మా. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులను బల వంతంగా విసర్జించినవాడు వైరాగ్యపరుడుగాడు. ఆ విషయములవల్ల కలిగే సుఖదుఃఖముల తారతమ్య మును మనస్సునకేది గోచరింపచేస్తున్నదో, అదే రాగము. అదే నేననే వస్తువు. ఆ వస్తువునందలి ప్రేమ చేతనే తన ఆనందముకొరకే మానవుడు వస్తువులను వ్యక్తులను ప్రేమిస్తున్నాడు. తన యందలి ప్రేమను (రాగమును) వదలినవాడే వైరాగ్యపరుడు.

పా : ఓహో! స్వార్థత్యాగమంటే యిదన్నమాట. అట్టి స్వార్థత్యాగ మెట్లు సిద్ధిస్తుంది స్వామీ? నాకు చెప్పరూ!

తా : ఎందుకమ్మా అంత తీవ్రత? అన్నీ క్రమంగా చెప్పు కోవాలి తల్లీ, శిష్యుడు తొందరపడినా గురువు తొందర పడరాదన్నారు. పెద్దలు.

పా : తమరు తరించేరు కనుక తమకే తీవ్రతా వుండదు నిమ్మకు నీరు పోసినట్లు నెమ్మదిగా వుంటారు. నన్న

కూడా త్వరగా తరింపచేస్తే నేనూ శాంతంగానే వుంటాను.

తా : సరేగాని తరించటం అంటే ఏమిటమ్మా అసలు?

పా : ఏమో అవన్నీ నేను చెప్పలేనుగాని, మళ్ళీ పుట్టకుండా వుంటే ఏ బాధా లేదు. అదే తరించడం అని నా వుద్దేశ్యం.

తా : నీ సంస్కారం చాలా గొప్పదమ్మా. లేకుంటే యింత చిన్న తనంలో నిశ్చయాలు ఎలా చేయగలుగుతావు తల్లీ మళ్ళీ పుట్టకుండా పోవాలనే ఆదర్శంవుండడమే శిష్యుని ముఖ్యలక్షణం.

పా : నన్ను పుబ్బేసి మరిపించి మురిపించాలని చూస్తున్నారా స్వామీ! నాయందు నాకుండే ప్రేమ ఎట్లా రద్దవుతుందో చెప్పండి ప్రభో!

తా : అబ్బ! ఎంతపట్టుదలమ్మా నీకు! నేను. నేను అని అంటు న్నావే ఆ "నేను" లేని దానిని తెలుసుకొంటే తప్ప నీయందు నీ కుండే ప్రేమాభిమానములు వదలవు తల్లీ!

పా : ఇందాకా తానే ఆత్మ అదే నేను అన్నారు. ఆ నేను లేనిదాని పేరేమి స్వామీ!

తా : దానికే పేరూ పనికిరాదు. దానికే రూపులేదు. నాడు కలో దానికి పరిపూర్ణ పరబ్రహ్మమని కొందరు పేరు పెట్టినారు.

పా : ఒహో ఆ పరిపూర్ణ పరబ్రహ్మమే నిజమగు దేవుడు అయి వుంటాడు. ఆ దేవుణ్ణి యెరిగిన తమరికంటె జ్ఞానులూ వైరాగ్యపరులూ యెవరు? నా యందేమైన లోపాలుంటే సరిదిద్ది శిష్యురాలిగా స్వీకరించండి స్వామీ! (మరల పాదాభివందనము చేయును)

తా : మరి శిష్యులకుండవలసిన ముఖ్య లక్షణాలు యింకా రెండున్నాయమ్మా!

పా : చెప్పండి స్వామీ! తప్పక ఆ లక్షణాలు నాకు కలిగే టట్లు ప్రయత్నిస్తాను.

తా : (1) గురుని మాటయందు సంపూర్ణ విశ్వాసముంచి బోధ వినాలి. (2) చంచల బుద్ధిమాని గురువు చెప్పిన మార్గము తప్ప యితర సాధనలన్నీ వదలివేయాలి.

పా : దేవుని మాటలయందెందుకు విశ్వాసముండదు స్వామీ? తమరు ఏ మార్గమందు ప్రవేశ పెట్టితే ఆ మార్గంలోనే వుంటాను. ఇతరాన్ని పూర్తిగా వదిలేస్తాను. తమ పాదాల ఆన.

తా ; శెభాష్! ఐతే నీవే దేవుడవు.

పా ; చిత్తం, చిత్తం ఐతే నావలెనే ప్రాణకోటి అంతా దైవస్వరూపమే అయివుంటుంది.

తా ; అవును ఒక్క దేవుడే ఇన్నిరూపాలలో కానవస్తు నడమ్మా.

పా ; అయితే యే రూపమూ లేని అసలు దేవుడొకడు వేరే విలక్షణంగా వున్నాడని మొదట్లో చెప్పారుగదా! యీ యిరువురను గూర్చి బాగా చెప్పండి స్వామీ!

తా ; మళ్ళీవస్తానమ్మా యీ మారువచ్చినపుడు చెవుతానే.

పా ; చిత్తం. చిత్తం. తమ రేరీతి వినుమంటే ఆ రీతిగానే వింటాను.

తా ; గురుశిష్యుల లక్షణములన్నీ యీ గురుగీత అనే గ్రంథంలో బాగా చెప్పేను. నేను మళ్ళీ వచ్చేటప్పటికి యీ గ్రంథమంతా చక్కగా చదవాలి. (అని గ్రంథ మిచ్చును.)

పా ; అట్లానే స్వామీ! (పురుషయులు నిష్క్రమింతురు)



# బాలబోధ 23

(ఐదవ రంగము)

పా : (అంతదూరం నుండగానే వస్తూన్న తాతను చూచి యెదురేగి) స్వామి గురుదేవా రండు దయచేయండి (అని గురుమూర్తిని తోడ్కొనివచ్చును)

పా : అవును స్వామీ! అంతఃకరణాలన్నీ కలసి వుంటా యన్నారుగా యిక్కడకు తమరు రావాలని సంకల్పించే సరికి తమరు రానున్నారని నాలో ప్రతిస్పందన కల్గి వుండాలి తండ్రీ!

తా : ఐతే! నన్నడగాలన్న ప్రశ్నలన్నీ మూటకట్టుకుచున్నావన్న మాట.

పా : లేదు ప్రభూ! తమరేమి చెపితే అదేవింటాను ఐనా నాక్కావాలన్న వేవో మీకిదివరకే చెప్పాను. వానిని గురించి చెప్పండి స్వామీ!

తా : ఐతే మొదట ఏ దేవుడు యిన్నిరూపాలలో గానవస్తూ న్నాడో ముందు చెప్పి ఆపైన యే రూపమూ ఎన్నడూ పొందని అసలు దేవుణ్ణి గురించి చెపుతాను సరేనా?

పా : చిత్రం, చిత్రం. నేనూ మీరూ, యింకా ప్రాణం వున్నవీ, లేనివీ యెన్నో కానవస్తూన్నాయి. ఐతే యీ రూపాలన్నీ ఒక్కటే ఎట్లవుతాయి స్వామీ?

తా : పంచదార పాకంపట్టి యెన్ని ఆకారాలేనా తయారు చేయుటంలేదా! ఆరూపాలన్నీ ఒక్క పంచదారే వహించి నట్లుగానని తెలుసుకో.

పా : అల్లాగా! పంచదారతో యిన్ని రూపాలు తయారు చేసిన వాడొకడు పంచదారకంటె వేరుగానుండాలి లేక పోతే పంచదార తనంతటతానే బొమ్మలు యెల్లా కాగలదు?

తా : కొంతమంది అలా మార్పు చెందుట దాని స్వభావమే. అలా మార్చేవాడు ఒకడు వేరే వుండక్కర్లేదంటారు. భూమిలో మట్టి యెన్నో లోహములుగా నవరత్నాలుగా మార్పు చెందుటలేదా అని పోలిక చెపుతారు.

పా : ఆ మాట నాకు నచ్చలేదు స్వామీ! అద్భుతమైన తెలివితేటలున్న వాడెవడో యీ రూపాలను ఏర్పాటు చేసివుండాలి అనే మాటే నప్పుతుంది. మట్టిబంగారంగా మారే శక్తికూడా ఆ దేవుడే మట్టికి కల్గించాడనాలి.

తా : అవును తల్లీ! ఆ అద్భుత తెలివిగల దేవునికే అన్ని అద్భుత శక్తులూ వున్నాయమ్మా!

వా : ఐతే స్వామీ - పంచదారతో చిలకలు వగైరా బొమ్మలు చేసి నట్లుగా యీ దేవుడు ఏ పదార్థంతో యీ సృష్టి అంతా చేసాడో మరి!

తా : అద్భుత శక్తులున్నాయన్నాంగా కనుక ఆయనకు అన్య పదార్థమేమీ అక్కరలేదు.

పా : అయితే గారడివానిలాగా శూన్యంలోనుంచే అన్నీ కల్పిస్తాడు కాబోలు!

తా ; అవునమ్మా! కొందరిట్లాగే అంటారు.

పా ; ఐతే ఆ మాట నిజం కాదన్న మాట మరిదాన్ని గురించి తమరేమి శెలవిస్తారు స్వామీ!

తా ; శూన్యంనుంచి ఏదీ రాజాలదు. ఆ శూన్యమనే దానిలో కూడా ఆ సృష్టి బీజములుంటే తప్ప. యిసుకలోనుంచి నూనె వస్తుందా?

పా ; ఐతే గారడివాని శక్తి వాని మంత్రదండమందున్నదా?

తా : కాదమ్మా గారడివాని శక్తి గారడివానియందేవుంది. ఏ పదార్థముతో దేవుడు సృష్టి చేస్తాడని అడిగేవు? ఇదిగో తనయందున్న యీ సృజనాత్మక శక్తిచేతనే సృష్టిస్తాడమ్మా. ఈ శక్తే పదార్థము. పదార్థమే శక్తి రెంటికీ తేడా లేదమ్మా! ఈ శక్తినే కొందరు మాయ అని పిలుస్తారమ్మా. యీ శక్తినే పదార్థంగా మారుస్తున్నాడు. దాని రూపాన్ని పట్టి ఆ పదార్థానికో పేరు.

పా : ఓహో! యిదా మాయంటే! ఐతే యీ మాయ ఆ దేవునిలో నున్నదేనా!

తా : అవునమ్మా! అగ్నికి కాల్చేశక్తి వున్నట్టుగా యీ దేవునికి యీ మాయాశక్తి వున్నది. కనుక యీ మాయా ఆ దేవుడూ ఒకటేనా రెండా?

పా : ఒక పేగదా! కనుక యీ దేవుడు మాయా దేవుడే గాని నిజం దేవుడుగాదన్న మాట.

తా : సరిగా గ్రహించేవు తల్లీ!

పా : ఐతే నా తల్లిదండ్రిలకు నేను పుట్టినట్లుగా యీ మాయా బ్రహ్మలకు జగత్తు పుట్టిందా?

తా : కొందరనేది అదే కాని తల్లిదండ్రులకు బిడ్డవేరై పుట్టి నట్లు యీ ప్రాణులు యీ జగత్తు ఆ దేవుడుకన్న వేరుగా లేవు.

పా : మరి యీ సృష్టి అంతా యేవిధంగా వచ్చింది స్వామీ!

తా : కొందరీ సృష్టి లేనేలేదన్నారు జగత్తు పుట్టనేలేదన్నారు.

పా : కనిపిస్తోందే మరి?

తా : త్రాటిని చూచి పామనుకొన్నట్టుగా యీ కనపడే దంతా నీ భ్రాంతి మాత్రమేనన్నాను.

పా : దేని చూచి యీ జగత్తని అనుకొంటున్నారు?

తా : ఆ దేవుణ్ణి చూచే

పా ; త్రాడు పాములా పొడుగ్గా వంకర టింకరగా పడి వుంటుంది కనుక త్రాడును చూచి పాముని భ్రాంతి కలగొచ్చు. ఆ విధంగా ఆ దేవుడు కూడా జగత్తులాగే వుంటాడా పోనీ అలా అందామన్నా జగత్తుయెన్నో రూపాలుగా వుందికదా.

శా : నీకు ఏ భావా తోచిందో నీకు ఆ రూపం తోస్తుంది అంటారు వాళ్లు.

పా : అదేమిటి స్వామీ! మా మేడెక్కి చూస్తే ఒక్కసారిగా గోదావరీ నదీ, ఆవలిగట్టూ, మధ్య తోటలు, పైన ఆకాశమూ, ఎంతో సుందరదృశ్యం చక్కగా ఒక్కసారిగా కళ్ళబడుతోంటే యివన్నీ ముందు భావా లోనికీ వచ్చి తరువాత కనపడ్డాయని అంటె వప్పుందా?

శా : ఒక్కసారిగా యిన్ని రూపాలుగా కనపడే అద్భుతశక్తి కూడా ఆ దేవునికే వుంది అంటాను.

పా : ఐతే యిన్ని భ్రాంతులకు కారణమైన ఆ మాయలమారి దేవుని వల్ల భ్రాంతియే కలుగును కాని శాంతి యెట్లు కలుగుతుంది? ఐతే స్వామీ! సృష్టివిషయంలో తమరి అభిప్రాయమేదో తెలపీయండి! స్వామీ యితరుల వాదాలన్నీ నాకెందుకు?

శా : అమ్మా! ఈమాయ బ్రహ్మలుగా రెండుగా తోచబడే దేవుడొక్కడే, ఆ దేవుడే అనేకం కావాలి అని సంకల్పించుకొని కోరుకొని స్థూలాతిస్థూలముగా తానే మార్పుజెంది జగత్తుగా అయినాడు. ఆ జగత్తులోని పంచభూతములతోనూ తానే అన్ని ప్రాణుల ఆకార

వికారములు దాల్చినాడు తానే వానితో ప్రవేశించి చైతన్యం కలిస్తూ స్థావరజంగము జీవో పాధులుగా వుండి సకల వ్యవహారములు తానే చేస్తూ తానే కర్తృత్వభోక్తృత్వముగల్గి సుఖదుఃఖములు పొందుచూ తానే తన భ్రాంతిలోపడి జనన మరణములు పొందు చున్నాడు.

పా : ఓహో! అందుకా "నీవే ఆ దేవుడ"వని క్రిందటిసారి తెలవిచ్చారు. యిపుడర్థమైంది. దేహరూపముగానూ దేహంలోనున్న జీవరూపంగానూ ఉన్నదీ దేవుడే, అన్ని ప్రాణులలోనూ అంతే ప్రాణంలేని జడవస్తువులూ అతడేనా? అని సందేహం కలుగుతోంది స్వామీ!

తా : రెండూ అతడే, జడభాగంజడంగా దేహాలుగా పరిణ మించింది. చేతనభాగం వానిలో తెలివి రూపంగా వుంది. అచిత్తూజడమూ ప్రతి దానియందూ పడుగూ పేకలాగు కలిసేవున్నాయి.

పా : యింకా యీ దేవుణ్ణి గురించి సాంతంగా చెప్పండి స్వామీ!

తా యిపుడు విన్నవన్నీ బాగా మననంచేయి. మరోమారు వచ్చి పూర్తి చేస్తాను.

పా : చిత్తం ప్రభూ. (ఇద్దరూ నిష్క్రమింతురు)

(ఆరవ రంగము)

వా : (వచ్చిన తాతకు మోకరించి నమస్కారంచేసి) రండి ప్రభో! తమ రాకకొరకే ఎంతో కాలంనుంచి ఎదురు తెన్నులు చూస్తున్నాను.

తా : అఖండ జ్ఞాన సిద్ధిరస్తు (తానుకూర్చొని) కూర్చో తల్లీ!

వా : అఖండ జ్ఞానమంటే ఏమిటి స్వామీ?

తా : సర్వమునందూ నిండియున్న ఆ దేవుని స్వరూపమే అది.

వా : నేనే ఆ దేవుణ్ణన్నారు గదా! ఆ అఖండ స్వరూపము నా యందెట్లు యిముడగలదో మరి? అట్టి మిడి పోవుట గూడ ఆయన అద్భుత శక్తులలో నొకటా?

తా : అట్లా కాదమ్మా! ఒక చిల్లుల కుండను చెరువులో ముంచినప్పుడు చెర్వులో నీరూ, కుండలో నీరూ కలసి తెంపులేక అఖండంగా నున్నదా లేక కుండలో నీరు వేరుగా వున్నదా?

వా : అర్థమైనది స్వామీ! కుండ పెంకు అడ్డముగా నున్నందున కుండలోని నీరని మాట్లాడటం మాత్రమే కాని నీరంతా అఖండంగానే వుంది! అట్లాగే దేహమడ్డంగా నున్నట్లు కనిపించినా వెలుపల లోపల, మధ్య, అంతా కలిసియే వున్నదన్నమాట.

తా : దేహావరణగా కానవచ్చేది కూడా ఆ దేవునియొక్క స్థూలరూపమే కానీ, అన్యంగాదు. అందుకే, కుండలో ఎక్కడ చూచినా మట్టియే వున్నట్లు దేహముకూడా చిన్మయం అనగా జ్ఞానరూపమే అయివుందన్నారు శంకరాచార్యులువారు.

పా : ఐతే అన్ని దేహముల యొక్క అన్ని వస్తువులయొక్క లోపల వెలుపల మధ్యావున్నది. జ్ఞానమేనన్నమాట. ఐతే యిక అజ్ఞానం అనేది? అది యెక్కడ వుంది?

తా : (చిరునవ్వుతో) మంచి ప్రశ్న వేశావమ్మా? దేహాలు అజ్ఞానమని అసత్యములని, దుఃఖరూపములనీ, జడలనీ కొందరంటుంటారు కాని అంతా జ్ఞానమయమే ఐతే అజ్ఞానమిక ఏది? లేనేలేదనాలి.

పా : అజ్ఞానమనేది అసలే లేకపోతే ఆమాట ఎందుకుపుట్టింది స్వామీ?

తా : అసాధ్యురాలవమ్మా! అంతా, జ్ఞానమయమైన ఆ దేవుడే అని తెలియక పోవటమే అజ్ఞానము.

పా : కొంచెం వివరించండి ప్రభో! అజ్ఞానమనే పేరుగల వస్తువు వేరే లేనేలేదా?

తా : వున్నవి వున్నట్లుగా కనపర్చేది వెలుగు. వున్నవి మరుగుపరచేది, లేని వస్తువులను తోపింపచేసేది చీకటి. వెలుగువంటిది జ్ఞానము. వెలుగు లేకుంటే దానిని చీకటి

అంటాముగదా?

పా : వస్తువులన్నిటిని ఆకర్షించి మరుగుపరచి వస్తురూపంగా కానవచ్చే చీకటి లేదనుట ఎట్లు!

తా : సూర్యుడున్నపుడు వెలుగు సూర్యుడు భూమి రెండవ భాగమునకు పోతే చీకటి. వెలుగు చీకట్లు రెండూ సూర్యునివలననే ఆకాశమందు కానవస్తూ వున్నవి. అట్లే జ్ఞానా జ్ఞానములు రెండూ అఖండ జ్ఞానస్వరూపుడగు ఆ దేవునివే అయి అంతఃకరణాలలో తోస్తూ వున్నవి.

పా : ఐతే అంతఃకరణమన్నా మనసన్నా ఒకటే గదా? మనస్సునందుకల్గే జ్ఞానమూ, దేవుని అఖండజ్ఞానమూ ఒకటేనన్నమాట సూర్యుని వెలుగూ, ఆకాశమందు ప్రసరించిన వెలుగూ రెండు ఒకటే అయినట్లు, ఆ అఖండ జ్ఞానమే ప్రతి అంతఃకరణమందూ ప్రకాశిస్తున్నదన్నమాట.

తా : సరిగా గుర్తించేవు తల్లీ. అందుకే ఈశ్వరుడు అందరి హృదయముల యందధిష్ఠించి యున్నాడంటోంది భగవద్గీత.

పా : అయితే కొందరియందు అజ్ఞాన రూపమగు చీకటి మాత్రమే వుంది. జ్ఞానం లేకపోవుటకు కారణమేమి స్వామీ?

శ్రా : ధూళి కప్పిన అద్దమునందు ముఖ ప్రతిబింబము సరిగా కానరానట్లే పరిశుద్ధాంతఃకరణము లేనిచో అందు దేవుడుండియున్నా, అజ్ఞానులైనవారు ఆయన ప్రకాశము ను గుర్తించరు.

పా : ప్రాణమున్న జీవుల్లయందు తెలివి ద్యాష్టంగా నున్నదీ దేవుడంటే అర్థమైనది కాని ప్రాణమూ కదిల్లిక లేని వస్తువులయందు, భూతములయందూ తెలివి యెట్లా వున్నది స్వామీ?

శ్రా : ప్రాణమున్నవానిని పిండాండములన్నారు. ప్రాణము లేనట్టితో చేవ స్తువులయందు కూడ ప్రాణరూపమైన కదలిక బీజరూపంగా వున్నది. పరమాణువులను శోధించి విశ్లేషంగావించి అందు మహా వేగంతో గిర్రున తిరిగేవానిని శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. ప్రతి వస్తువు వందు, వస్తుగుణము, లేక వస్తుశక్తి ఉండనే వుంది. ఆ రూపముగా వానియందుకూడ తెలివి (జ్ఞానము) పని చేస్తూనే ఉన్నది. భూమి తిరుగుతోంది. అని చదువు కొన్నావుగా! తన చుట్టూ తాను తిరిగే శక్తి ఆ భూమియందున్నదా లేదా? అట్లే ఖగోళమునందలి సమస్తము తిరుగుచూనే వున్నది. పడవల్లోపల కూర్చున్నవానికి పడవచలనము కానరానట్లే మనము భూతముల చలనమును గుర్తించలేకపోతున్నాము. కదిలించే ప్రాణశక్తి సమస్త బ్రహ్మాండమునందు వుంది సుమా!

పా : ప్రాణమున్నవానిని పిండాండములన్నారు. మరి బ్రహ్మాండమంటే ఏమి? ప్రాణము లేనిదా ఏమి?

తా : కాదమ్మా కాదు. కదలిక (ప్రాణము) సమస్తమునందుండగా ప్రాణములేనిది ఏదీ లేదుగదా నీకు తెలియవచ్చే సమస్తమూ కలసి బ్రహ్మాండము అని తెలుసుకొంటే సరిపోతుంది. ఈపైన చెప్పిన రీతిగా పిండ బ్రహ్మాండముల యందంతటానున్న అఖండ జ్ఞానమునకే ఆత్మ అనిపేరు జ్ఞానమునే అచ్చ తెనుగులో ఎఱుక అంటారు.

పా : ప్రపంచం అంతా పంచభూతమయము అంటూంటారు. పంచభూతములయందూ తెలివి ఏ రూపంగా వుండి ఏ పనులు చేస్తోంది స్వామీ?

తా : పంచ తన్మాత్రలనబడే శబ్ద, స్పర్శ రూప, రస, గంధములుగా నున్నది. ఆ తెలివే సృష్టి స్థితిలయ విస్తీర్ణ ఆకర్షణలనే పంచకృత్యములు, చేయుచున్నది. బ్రహ్మ విష్ణు రుద్ర ఈశ్వర సదాశివులనే పంచకర్తల పేర్లు వహించినది. ఆ తెలివే.

పా : అయ్యా, గురుగీత పుస్తకమంతా చదువమని యిచ్చేరుగా; చదివేసాను. అందులో గురుసాక్షాత్ పరబ్రహ్మ అన్నారు. ఆ పరబ్రహ్మ అంటే ఏమిటి స్వామీ?

తా : ఆత్మ అన్నా బ్రహ్మమన్నా పరబ్రహ్మ అన్నా దేవుడన్నా, అఖండ ఎరుకన్నా గురుస్వరూపమన్నా (గొప్ప వస్తువు) ఒకటేనమ్మా.

పా : దేవుడు దేవుడంటూ గుడిలో బొమ్మలను పెట్టి పెట్టేరేంమరి?

తా : దేవుడు అంటే ప్రకాశించేవాడు. అంటే జ్ఞాన స్వరూపుడు అన్న మాట జ్ఞానస్వరూపుడైన దేవుడు యీ కళ్ళకు కనుపించడు. గనుక కళ్ళకు కనిపించే విగ్రహాలను ఏర్పాటు చేసి పూజించు కోమన్నారు. పెద్దలు అంతా జ్ఞానమయం కనుక ఆ విగ్రహాలలో దివ్యత్వాన్ని దర్శించటం మంచిదే.

పా : జ్ఞానాజ్ఞానములు రెండూ జ్ఞానానికే వున్నవన్నారు చీకటివలె అజ్ఞానం అఖండ జ్ఞానస్వరూపమైన ఆత్మను కప్పివేసి, వున్న దానిని వున్నట్లుగా తెలియనీయకుండా చేసి భయభ్రాంతులను కల్గిస్తుందన్నారు. సుఖమూ శాంతి వుండాలంటే, అజ్ఞానం అసలు లేకుండా పోవాలి గదా! అది ఎల్లా పోతుంది స్వామీ!

తా : అజ్ఞానమూ జ్ఞానమూ రెండూ విడదీయరానివి తల్లీ! ఒక రూపాయి నాణెమునకు బొమ్మా బొరుసులాంటివి సర్వద్వంద్వములు అట్లే ఒకటుంటే రెండోది వుండక తప్పదు. సర్వద్వంద్వాతీతమైన దొక్కటే పరిపూర్ణ పరబ్రహ్మమే. వెలుగుంటే చీకటి కూడ తప్పదు.

పా : అంటే వెలుగూ చీకటి రెంటికీ అతీతమైనది అంటే, పరిపూర్ణ పరబ్రహ్మమందు జ్ఞానము అజ్ఞానమూ రెండూ లేవా? ఆశ్చర్యముగా నున్నదే! దానిని గురించి పూర్తిగా చెప్పండి స్వామీ!

తా : ఈ సారివచ్చినపుడు చెప్తానే జ్ఞానా జ్ఞానములుగల ఆత్మను గురించి పూర్తిగా తెలసినదా?

పా : చిత్తం, చిత్తం. (ఇద్దరు నిష్క్రమింతురు)

## జ్ఞా[illegible]బోధ

(ఏడవ రంగము)

పాప: (వచ్చిన తాతకు మోకరించి నమస్కరించి) స్వామీ! దయచేయండి "ఎపుడు వచ్చి జ్ఞానాజ్ఞానాతీతమైన పరిపూర్ణ పరబ్రహ్మమును గురించి చెపుతారా" అని తపస్సు చేస్తున్నాను.

తాత: దాన్ని మాటలతో ఎట్లా చెప్పమంటావు తల్లీ! అది వాచాతీతము.

పాప: ఎందుచేత చెప్పలేము స్వామి!

తాత: రూపమున్నదానినే కన్ను గుర్తిస్తుంది. అట్లే శబ్దమున్న దానినే వాక్కు వర్ణించకలదు. ఆపరిపూర్ణ పరబ్రహ్మ మందు శబ్దం లేశమైనా లేదుసుమా! అట్లే దానికే రూపము లేదు. కనుక కంటిచే దానిని చూడలేము.

పాప: మనస్సుచే గ్రహించ వచ్చునేమో! ఏలాగైనా నా మనస్సుకు పట్టించండి స్వామీ!

తాత: అది మనస్సుకుకూడా విషయం కాదు. ఎందుచేతనంటే దానియందు అంతరేంద్రియ విషయములైన సంకల్ప నిశ్చయ, చింతన అభిమానము లేవి లేవు. ఎరుగబడే లక్షణము యేమీ లేకుంటే దేనిచేత తెలుసుకుంటావు.

పాప: ఆదేమిస్వామీ! తమరే దయదలచి చెప్పాలిగాని నాకెట్లా తెలుస్తుంది. ప్రభో! అది అనుభవానికి యెట్లా వస్తుందో సూచించండి స్వామీ!

తాత: అది అనుభవ గమ్యము కూడా కాదుతల్లీ!

పాప: అర్థంకాలేదు. ఎందుకనుభవానికిరాదు? సెలవియ్యండి

తాత: అనుభవము అంటే పుట్టిన వస్తువును అనుసరించి కలిగే సంవేదన మాత్రమే.

పాప దృష్టాంతరములేమైనా చెప్పండి స్వామీ! యీ మట్టి బుర్రకు అర్థం కావడంలేదు. అనుభవము అనేది దేనికి కలుగుతోంది?

తాత: సుఖదుఃఖములను ఆకలిదప్పులను గుర్తిస్తున్నావుగదా ఎట్లా గుర్తిస్తున్నావు ఆగుర్తింపే జ్ఞానమే అనుభవిస్తోంది. జ్ఞానము మనస్సు, బుద్ధి చిత్తము. అహంకారము అని అంతఃకరణము అయిదు విధములుగా వ్యవహరిస్తున్నది. అజ్ఞానానికి తెలియబడేది విషయమనీ,

లేక అనుభవమనీ అంటారు. కనుక జ్ఞానమనే యింద్రియమునకు అనుభవము విషయమై యున్నది, పరిపూర్ణ బ్రహ్మము ఏ యింద్రియము చేతనూ అగమ్యమైవున్నది.

పాప: అర్థమైంది స్వామీ! వాచా తీతము మనోతీతమూ. అనుభవా తీతమూ, అగోచరమూ, అగమ్యమునై యున్నదానిని తమరెట్టా బోధిస్తారో తమరినే నమ్ముకొన్నానుస్వామీ! తెలియరానిది అని చెప్పుకొని పూరుకొంటే ఏమీ తెలిసినట్లు?

తాత. నిజమేగాని తెలియరానిదాన్ని తెలుసుకోవాలంటే తెలియవచ్చే సమస్తమూ ముందుగా తెలుసుకోవాలి.

పాప; ఈ అనంతవిశ్వంలో అనంతంగావుండే వస్తువుల నన్నిటిని తెలుసుకోవాలంటే ఎన్ని జన్మలైనా సరిపోతాయా స్వామీ!

తాత; అట్లా కాదమ్మా, ఏ వస్తువును తెలుసుకుంటే సర్వమూ తెలియబడుతుంది. ఆ ఒక్క వస్తువును తెలుసుకొంటే సరిపోతుంది.

పాప; ఐతే ఆ వక్క వస్తువేదో త్వరగా చెప్పండి స్వామీ

తాత; యిదివరకే చెప్పానమ్మా, అపుడే మరచినావా? ఏది సర్వసృష్టిగా నామరూపాత్మకమైవుందో ఆ ఆత్మయేనమ్మా!

పాప; (లెంపలు వేసుకొని) అవును తండ్రీ చెప్పినారు స్వామీ నాయందు సకలమునందు జ్ఞానాఽజ్ఞానరూపంగా నున్న

ఆ దేవుడే ఆ వస్తువు తండ్రీ! కాని ఆ వస్తువు తెలియ బడుతూనే వుంది. కాని తెలియరానిది ఎల్లా తెలియ బడినట్లవుతుందో తెలియ రావడంలేదు తండ్రీ!

తాత: అనునమ్మా! గురువు చెపితేనేగాని ఎంతవారికి సాధ్యం కాదుతల్లీ?

పాప: (తిరిగి మోకరించి నమస్కారము చేస్తూ) అందుకేగద తమ్మాశ్రయించినాను తండ్రీ!

తాత: (కరుణామృత దృష్టితో పాపను చూస్తూ నీవైన ఆ దేవుణ్ణి విడిచి చూస్తే అంతా ఆపరిపూర్ణ పరబ్రహ్మ మేనమ్మా.

పాప: అంతా నేనే నేనే అంతా నేనే ఆ దేవుణ్ణి, కాని నాలో కొంత మాత్రమే నాకు కానవస్తోంది. కానరాని దెంతో వున్నది. దాన్ని కూడా చూచేదెల్లా? ముందుగా అది తెలపేయండి మహాప్రభో! (పాదము లంటి తిరిగి నమస్కరించును)

తాత: ఆ కండ్లకు కానరాని దానిని స్థూల అరుంధతీ న్యాయంగా గుర్తించాలి.

పాప: స్థూల అరుంధతీ న్యాయమనగా యెట్టిది?

తాత: సప్తఋషులనే నక్షత్రకూటములో సప్తఋషుల పేర్లతో యేడు నక్షత్రములు కండ్లకు బాగా కనిపిస్తూ వుంటాయి. అందు వశిష్ఠుడనే నక్షత్రమునకు ప్రక్కన కొంచెము

క్రిందుగా అరుంధతి అనే బహు చిన్న నక్షత్రము మిణు మిణుకుమంటూ కనపడీ కనపడకుండా వుంటుంది. దానిని నూతన వధూవరులకు పెండ్లినాడు చూపించుట ఆచారము, అప్పుడు "అదుగో అరుంధతి" అని చూపితే వధూవరులు దానిని గుర్తించలేరు గనుక సప్తర్షి మండలమును చూపి ఆపిదప వశిష్ట నక్షత్రమే యని చూపించి పరకు దాని ప్రక్కనున్న అరుంధతిని గుర్తింపచేస్తారు, అల్లా ఆ కానరాని ఆ పరమాత్మను మందగా గుర్తించాలి.

పాప: యీదృష్టాంతం మాత్రమెట్లా సరిపోతుంది స్వామీ. ఎంత చిన్నదైనా అరుంధతిని కండ్లతోనే చూస్తారుగా! మరి కండ్లకు కానరాని పరమాత్మను ఎట్లా చూడాలి స్వామీ!

తాత: దానిని మనసుచే చూడాలమ్మా!

పాప: ఇదివరకు ఒకసారి చూచి వున్న దానినైతే మనస్సులో ఆగుర్తు వుంటుంది కనుక దానిని మనస్సుచే గుర్తించవచ్చును. కాని దానిని నేనెప్పుడూ చూడలేదే దానిని నా మనసుకు ఎట్లా చూపిస్తారో తమదే భారం తండ్రీ (అని మరల పాదములంటి నమస్కరించును.)

తాత: (హస్త మస్తక సంయోగంచేసి) యిదేనమ్మా నీ అఖండ స్వరూపము నామరూపాదికములన్నీ విడచి తన్మయం అయిపోవమ్మా ఇంతవరకు నీకు బుద్ధి నిశ్చయం కాలేదు. అందుచే తొట్రుపాటు పడ్డావు తల్లీ? ధ్యాన యోగంలో దీన్ని ముందు సాధించమ్మా ఆత్మ నిశ్చయం పొందుతావు.

పాప: బుద్ధినిశ్చయము, ఆత్మనిశ్చయము అంటేఏమిస్వామీ?

తాత: తాను అనే తన తెలివి అఖండాత్మరూపంగా నిలబడి పోవుటనే ఆత్మనిశ్చయం లేదా అపరోక్ష జ్ఞానం అంటారు అట్లుగాక హేతువాద పూర్వకముగా ఆత్మ యొక్క పరోక్షజ్ఞానము కలుగుట బుద్ధి నిశ్చయము.

పాప: అట్టి ఆత్మనిశ్చయం తమకృపవల్లనే నాకు సిద్ధించాలి. లేనిచో అంతటి ఏకాగ్రత నాకెట్లు కలుగును తండ్రీ?

తాత: (మరల హస్తమస్తక సంయోగంచేసి చెవిలో మంత్ర ముపదేశించి) చూడమ్మా యీమంత్రం ఎంత జపిస్తావో అంతకంతా నీకు గురుకృపా సంసిద్ధితో ఏకాగ్రతకల్గి అట్టి ఏకాగ్రత మనస్సుతో నీవపరోక్ష సాక్షాత్కారము పొందగలవు తల్లీ!

పాప: మంత్రముచే మనోబలము సాధిస్తు తొలి మెట్టుగా ఏకాగ్రసాధన యేవిధంగా అభ్యాసం చేయను స్వామీ తెలవియ్యండి.

తాత: (సంచిలో తన ఫోటోను తీసియిస్తు) ముందు గురుమూర్తి నామరూపాలను కొంతకాలము ధ్యానించుము తల్లీ. ఈ ఫోటోకు పూజ చేసుకుంటూ దీనియందలి రూపంపై మనసు నిలుపుట అభ్యాసం చేయమ్మా మళ్ళీ నెలకొస్తానుగా అపుడు పరీక్షిస్తా నీ ఏకాగ్రత మరి వస్తాను.

పాప: ధన్యోస్మి (అని చిత్రపటమును స్వీకరించును) సెలవు స్వామీ నేనుంటాను (ఇరువురూ నిష్క్రమింతురు)

# బాలబోధ

(ఎనిమిదవ రంగము)

పాప: (వచ్చుచున్న తాతకు యెదురేగి తోడ్కొనివచ్చి, కాళ్ళుకడిగి, పాదతీర్థము శిరస్సున ధరియించి) స్వామీ తాము చెప్పిన రీతిగా తమ ఫోటోలోని రూపాన్ని మనస్సుచే ధ్యానము చేసినాను తండ్రీ? ఇపుడా రూపమే నా కంటిపాపలో కాపురం పెట్టుకొంది. కను మూసినా తెరచినా మీ మూర్తే గోచరిస్తున్నది స్వామీ!

తాత: నీ పూర్వపుణ్యం గొప్పదమ్మా! యింత శీఘ్రంగా నీ కేకాగ్రత సిద్ధించిందంటే ఆశ్చర్యం!

పాప: ఇక నా కర్తవ్యమేమి దేవా?

తాత: ఇప్పుడింక నీ స్వరూపధ్యానంచేసి ఆ ఏకాగ్రతయందు ఆత్మనిశ్చయం పొందాలి.

పాప: ఏకాగ్రత అంటే ఏమి స్వామీ?

తాత: ఒకే వస్తువుపై మనస్సు లగ్నమై యిటూ నటూ పరుగలిడకుండుట, అడ్డు నిలుపక చంచలమై యిటూ నటూ పరుగులిడుట అనేకాగ్రత.

పాప: మనస్సు నిలబడుటవలన ప్రయోజనమేమి? లేనిచో గల్గు నష్టమేమి?

తాత: మనస్సు దేనిపై నిలచునో ఆ వస్తు రూపంవహిం చును ఇతర మేమీ అవుడు వానికి తెలియబడదు.

కనుక విషయాదులవలన నాకర్షింపబడి భ్రాంతులకు లోనై పాపపుణ్యకర్మలొనర్చుచు. జనన మరణరూప సంసార చక్రమున పరిభ్రమించదు.

పాప: మనస్సు చంచలమై యుండుటకు కారణమేమిటో మరి?

తాత: అది వాయుభూత సంయోగముచే యేర్పడినందున చలించుట దాని సహజ స్వభావము.

పాప: ఐతే, దాని సహజ స్వభావమును మార్చుట కెవరి వశము స్వామీ! ఏదో కొంతకాలము బలాత్కారముగా దాని చలనమును కట్టగలమేమో!

తాత: నిజమేతల్లీ? అందుకే కొందరు మనస్సును లేకుండా చేసేయ్యాలంటారు!

పాప: మనిషి బ్రతికుంటే మనసు లేకుండా పోతుందా వారి భ్రాంతిగాని!

తాత: పోదమ్మా పోదు.

పాప: పోనీ యేవస్తువుపైనైనా, కొంచెం నిలిచినా, దాని యందుగూడా అన్నిగాని, కొన్నిగాని విషయము లుంటూనే వున్నాయే; ఏ విషయమూ లేని వస్తువంటూ ఒకటున్నదా తండ్రీ!

తాత: లేదమ్మా లేనే లేదు. వస్తువు అని చెప్పటానికే వీలుగాని ఒక్క పరిపూర్ణ పరబ్రహ్మమునందు తప్ప మిగతా అన్నిటియందు కొద్దో గొప్పో పంచన్మాత్ర విషయములున్నాయి తల్లీ!

పాప: నా నిజస్వరూపమైన ఆత్మయందు కూడా వున్నాయా?

శాంత: లేకేం పరిమాణంలో, అనగా బీజరూపములో వున్నాయి. కనుకనే ఆ యాత్మ మనస్సుచే ధ్యానించదగినదై యున్నది. మనస్సు కేదో ఆలంబనముంటూ వుంటేనే కాని మనస్సు ఎట్లా గ్రహిస్తుంది. గ్రహించి వెట్లా దానిపై నిలుస్తుంది.

పాప: కనుకనే పంచతన్మాత్ర రహితమైన పరిపూర్ణ పరబ్రహ్మము మనస్సుచే గ్రహింపరాదన్నమాట?

శాంత: సరిగా గుర్తించావమ్మా! వస్తువునందు తన సంబంధమైన దేదైనా వుంటేనే మనస్సు తెలుసుకోనగలదు.

పాప: కొంచెం విపులపర్చండి స్వామీ?

శాంత: శబ్దతన్మాత్రనుండి పరిణమించిన అంతరేంద్రియములో మనస్సు ఒకటి కనుక పంచతన్మాత్ర సమిష్టిరూపమైన బ్రహ్మమును (ఆత్మను) గుర్తింపగలుగును.

పాప: మనస్సు ఆత్మసాక్షాత్కారము వలన ఆత్మరూపమే వహించునుగదా! అప్పుడు మనస్సు నాశనము కాలేదా?

శాంత: లేదు ఆ ఏకాగ్రత ఎంతవరకుండునో అంతవరకు మనస్సులేదు కాని శాశ్వతముగ మనోనాశనముగుట లేదు.

పాప: పోనీ ఆత్మయైనా, అమనస్కమై యున్నదిగదా?

శాంత: కాదుకాదు. ఏదో సాధర్మ్యముండుటచేతనే మనస్సు ఆత్మను గుర్తించి ఆత్మరూపమగుచున్నది. తిరిగి మనో

రూపం చెందుచున్నది. మనస్సుచే తెలియబడేదికూడా మనోధర్మము కల్గినదే కనుక దానిని కూడ అమనస్క మనరాదు. మనస్సు తన కారణరూపం వహించిందన్న మాట మనోఆత్మలు కార్యకరణములుగా నున్నవన్నా తప్పులేదు.

పాప ఐతే పంచతన్మాత్రరహితమైన పరిపూర్ణ పరబ్రహ్మ మొక్కటే సహజముగ అమనస్కమై యున్నదన్న మాట సరేనా మనస్సు ఏకాగ్రమై ఆత్మరూపంవహిస్తే. ఆత్మనే నేనై రెండవది లేక ఒక్కటౌనే యుంటానన్న మాట!

తాత; మరి నేనో? నా మాట యేమి!

పాప; ఆ మీరే గొప్ప స్వరూపంగదా? మీలో నేనైక్యమై యుంటానన్నమాట.

తాత; క్రొత్తగా ఐక్యము అయినావా? తెలియక పూర్వం వేరుగా నున్నావని అనుకొన్నాను గాని—

పాప; చిత్తం చిత్తం నిన్న మాబామ్మ "గురువు శిష్యుడాయె" శిష్యుడు గురువాయె - గురువు శిష్యులనందు గురు తొక్కటాయె" అని పాటపాడింది. అది విని ఐక్యం పొందాలి కాబోలు ననుకొన్నాను.

తాత; అక్కర్లేదు. గురుశిష్యులు వేరు అనే భావనతొలగి, యిద్దరిలోని గుప్త ఏకరూపమనే భావమారూఢమైతే, వున్నదంతా యేకమగు గురుస్వరూపమే.

పాప; ఆపైన యిక తెలియదగినదేమున్నది స్వామీ?

తాత; ఇక తెలియదగినదేదీలేదు. అదే తెలివి రూపం. తెలుసుకొనేవాడూ, తెలిసీ తెలియబడేది అంతా అదే.

పాప; ఇక ఆపైన శుద్ధ శూన్యమేనన్నమాట.

తాత; శూన్యమని చెప్పే నీ గుర్తున్నదిగదా! శూన్యమెట్లగును? గనుక శూన్యమన్నా ఆ తెలివే. మహాశూన్యమన్నా ఆ తెలివే.

పాప; అట్టి నా తెలివి మహాశూన్యమైన పిదప నుండేది పరిపూర్ణ పరబ్రహ్మమన్న మాట.

తాత; కాని అది ఉన్నదని చెప్పటానికి నీవూ నేనూ ఏక్కడున్నాము? అపుడే గురుశిష్య రాహిత్యం.

పాప; ధన్యోస్మి దానిని చూడకపోయినా చూచినట్లేవుంది స్వామి తప్పక అది వున్నది ముమ్మాటికి వున్నది.

తాత; వుండజూచుకొనుట అంటే యిదే.

పాప; వుండజూచుకొనుచున్నాను స్వామీ! ఐయితే ఆత్మసాక్షాత్కారమైతే మోక్షమంటారేమిటి స్వామి?

తాత; మనస్సు విషయాక్రాంతమైవుంటే బంధము అసంగమై సాక్షిగా నున్నపుడు మోక్షము. బంధమోక్షములు రెండూ లేనిదే పరిపూర్ణ బ్రహ్మము. బంధమోక్షములు రెండూ మనోవికారములే. కనుకనే బంధమోక్షములు మిథ్యేనన్నారు.

పాప; బాగానే అర్థమైంది స్వామీ! నా నిజరూపమైన ఆత్మసాక్షాత్కారం పొంది, అపరిపూర్ణ బ్రహ్మమందు

పునికిగల్గివుంటే జన్మ రాహిత్యం కాగలదు. ఇదేనా పరిపూర్ణ సిద్ధాంతము?

తాత; కాదమ్మా - ఎంతమాత్రము కాదు. పరిపూర్ణ పరబ్రహ్మమందు నిజరూపము లేదు. వుంటే - నీ నిజరూపమూ పరిపూర్ణ పరబ్రహ్మమూ, ఒకటే అవుతాయి. ఇది అదికాదు అది యిదికాదు పరిపూర్ణ పరబ్రహ్మమిదితరమేమిఖన్నా, అసలు దానిని పరిపూర్ణ మనడానకే వీలులేదు. కనుక నీ స్వరూపం దేనియందు లేదో ఆదే పరిపూర్ణం అది తప్ప రెండోది ఏదీలేదు. నీ స్వరూపమే అన్ని రూపాలు అవుతుంది కాని పరిపూర్ణ పరబ్రహ్మం మాత్రం కాజాలదు. ఇదీ సిద్ధాంతం.

పాప; అది వుండజూచుకోవడమే అయింది. కానీ ఆ పరిపూర్ణం ప్రత్యక్షంగా తెలియచ్చేదెట్లు స్వామీ.

తాత; అది లేనెరుకకే ప్రత్యక్షం. అంటే ఎరుక లేకపోవడమే ప్రత్యక్షం అన్నమాట, బొందెతో కైలాసం వెళ్ళాలనే భ్రాంతి యెట్టిదో ఎరుకతో పరిపూర్ణము చూడాలనుకోవడం అట్టి భ్రాంతే సుమా!

పాప: అర్థంకాలేదు తండ్రీ! లేనెరుకకది ఎట్లా ప్రత్యక్షమో ఒ దృష్టాంతం చెప్పడి స్వామీ!

తాత: చీకటికి సూర్యుడు ప్రత్యక్షమగునా? సూర్యునిపొడసోకేసరికే చీకటిలేకుండాయె పోతుందా. అట్లని సూర్యుడు లేడని చీకటి పలుకవచ్చునా? అసలు సూర్యుడు ప్రత్యక్షమా? అప్రత్యక్షమా? ప్రత్యక్షమేగదా?

పాప: సూర్యుడు చీకటిని పారద్రోలినట్లు పరిపూర్ణ మెరుకను పారద్రోలునా?

తాత: అబ్బెబ్బె అట్లా అనరాదమ్మా. సూర్యుని పొడ సోకే టప్పటికి చీకటి తనంత తానే లేకుండాపోయినట్లు ఎరుక తనంతట తానే లేకపోవును.

పాప: మరి యిక నాకర్తవ్యమేమి స్వామీ?

తాత: నీ నిజరూపమైన యెరుకను విడవడమే నీకర్తవ్యం

పాప: ఎరుకను నే నెట్లు విడవాలి? విడచి నే నెట్లా బ్రతకాలి?

తాత: (తిరిగి హా స్తమ స్తక సంయోగం గావించి చెవిలో ద్వాదశి షోడశి వాక్యముల నుపదేశించి) వీనిని కదా జ్ఞప్తియందుంచుకొంటే గురుకృపవలన యెరుక భ్రాంతి రహితమై పరిపూర్ణ పరబ్రహ్మము స్వతసిద్ధమై నిలచును.

పాప: ఎరుకను విడచి నేనెట్లు జీవించాలి స్వామీ?

తాత: ఎరుక ఎక్కడికైన లేచిపోతుందా? దానియందలి సత్యత్వ భ్రాంతి మాత్రమే రహితమగును?

పాప: అర్ధంకాలేదు తండ్రి ఒక్కదృష్టాంతం సెలవీయండి స్వామీ?

తాత: ఎండమావులయందు నీరు లేనేలేదని తెలిసిన తరువాత కూడా ఎండమావులలో యింకనూ నీరు తోస్తూనే వుండునుగదా తోస్తున్నా నీరులేదని యెట్లు దృఢమో అట్లే సరిపూర్ణ పరబ్రహ్మమందు ఎరుక లేనేలేదని

దృఢమగును. దానిలో సర్వభ్రాంతి రహితుడై అశరీర పద్ధతిలో శేషజీవితము సాగించును.

పాప ఆ అశరీర పద్ధతి ఏమో తెలవియ్యండి స్వామీ!

తాత: యీసారి వచ్చినపుడు జెప్పుతాలే తల్లీ!

పాప: చిత్తం! చిత్తం! (పాత నమస్కరించును ఇద్దరూ నిష్క్రమింతురు.)

# బాలబోధ

## (తొమ్మిదవ రంగము)

పాప: (తాత కెదురేగి పాదములకొరగి నమస్కరించి) రండి స్వామీ! దయచేయండి తమ కొరకే యిన్నిదినములుగా నిరీక్షిస్తున్నాను.

తాత: స్థిరచిత్తో భవ! పూరకే నాకొరకు నిరీక్షించుటయేనా, విన్న విషయాలు మననమేమన్నా చేస్తున్నావన లేదా?

పాప: చిత్తము స్వామీ! మననం చేసినాను. తమ కృపవల్ల సంశయము లేమీ కలుగలేదు.

తాత: ఐతే యిక నాపని తీరినది. పోయినారారా?

పాప అయ్యో అది యేమిస్వామి! అశరీరపద్ధతి యంటిరే! అదేమో తెలపియండి తండ్రీ అశరీరమనగా యీ దేహమే లేక వుండుట యెట్లు?

తాత మరల మొదటికి వచ్చితివా? శరీరమనగా స్థూలంగా

కానవచ్చే యీ దేహంకాదు సర్వస్వమును గుర్తెరిగే దేదో ఆయెరుకే శరీరం.

పాప: ఆ శరీరం అంటేయేమి స్వామీ?

తాత: ఆ గుర్తెరిగే తెలివితేనిదే.

పాప: తెలివేలేని ప్రాణులు, జడమైన వస్తువులు, ఎన్ని లేవు? అవన్నీ అశరీరములేనా?

తాత: కేవలం జడమైనదేదీ లేదు. అన్ని ప్రాణులయందు వస్తువులయందు యీ తెలివి ఏదోరూపంలో నుందిగాని, లేకపోలేదని చెప్పలేదా?

పాప: (చెంపలు వేసికొని) చెప్పినారుస్వామీ. శక్తిరూపంగా. మరుపు రూపంలో, పరావాగ్రూపంగా చరాచర జగత్తునందు యెరుక వున్నది. ఐతే ఆత్మకుకూడా గుర్తెరిగే శరీరంవున్నదా?

తాత; పిచ్చితల్లి! ఆత్మే గుర్తెరిగే శరీరమమ్మా!

పాప; పరమాత్మయందుకూడా యీ గుర్తెరిగే శరీరమున్న దన్నమాటే! అది యేమి పనిచేస్తోంది.

తాత; దానిసంకల్పము వల్లనే సృష్టిస్థితి లయములు జరుగు చున్నవి. అదియే సర్వశరీరములయందు గుర్తెరిగే శరీర ముగా నున్నది.

పాప; యీ స్థూలశరీరములయందు గుర్తెరుగే శరీరమున్నది గదా! అట్లే పరమాత్మయొక్క గుర్తెరిగే శరీరాన్ని ఆవరించిన స్థూలశరీరమేది;

తాత; అసాధ్యురాలవమ్మా! అదేనమ్మా మూలప్రకృతి, కనుక యీ జీవేశ్వర జగత్తంతా దాని స్థూల శరీరమే తల్లీ!

పాప; మూలంలేని మా గుర్తెరిగే శరీరం యేమీ లేదనుకుంటూ సకలకర్మలు చేసుకొనుచుండుటే ఆ శరీర పద్ధతి అనుకొంటాను.

తాత; ఏమీ లేదనుకొన్నప్పుడు గుర్తెరిగె శరీరం వున్నట్టూ లేనట్టు! ఏమీ లేదనుకుంటూ చేసేవారికి ఎరుక మరీ గట్టిగ వుంచమన్నారు. దీక్షితులవారు.

పాప; మరి యెట్లా స్వామీ?

తాత; లే నెరుకతో పరిపూర్ణ పరబ్రహ్మమును కనిపెట్టి ఎరుకను విడచితే పరిపూర్ణ పరబ్రహ్మము స్వతస్సిద్ధమై నిలచును. అపుడే ఎరుక నేకలనుండి మేలుకొన్నట్లగును. అట్టి మేల్కలో చేసే సకల వ్యవహారముల పుణ్యపాప సంస్కారములంతఃకరణ కంటవు. సర్వవాసనారహిత మైన అంతఃకరణ పుండియు లేనట్లే. కర్మలు చేసినా చేయనట్లే. ఇదేఆ శరీరపద్ధతి నవలంబించుట ఇదియే కర్మ

కాశము. (ఫలము లంటకుండ కర్మలు చేయు నేర్ప తనము) ఇది సాధించుటే నైష్కర్మ్యసిద్ధి.

పాప: నైష్కర్మ్య సిద్ధియంటే ఏమిటిస్వామీ?

తాత: కర్మరాహిత్య స్థితికలుగుట

పాప: కర్మలుచేయుట మానివేసి కూర్చొంటే సరిపోదా దానికి యీ గొడవంత ఎందుకుస్వామీ!

తాత: కర్మ సన్యాసము (అనగా కర్మలు విడుచుట) సర్వ సంగ పరిత్యాగము చేసిన సన్యాసులకుకూడా సాధ్యము కాదు. ఇక గృహస్థుల మాట వేరే చెప్పవలెనా? ప్రాణము చలన స్వరూపము. వుఛ్వాస విస్వాసలు జరిగి నంత కాలము కర్మ జరుగుట తప్పదు? గాలిపీల్చుటయే యొక కర్మ.

పాప: అయితే ప్రాణచలనము నరికట్టి సమాధి నిష్టలో కూర్చుంటేనో?

తాత: అపుడు కూడా శరీరంలో చలనము లేకపోలేదు. గోళ్ళు వెంట్రుకలు పెరుగుచునే యుండును. మరిన్ని సమాధి నుంచి ఎప్పుడు లేస్తే సర్వకర్మలూ అవసరమై. సర్వ భ్రాంతులు మరల కలుగుచునే వుండును. సర్వభ్రాంతు లకు మూలం, మూలంలేని యీ గుర్తెరిగె శరీరం అన్నారు. దీక్షితులవారు కనుక దాని రహిత స్థితిని

గుర్తెరిగి అట్టి మేల్కలోనున్న వారికి తప్ప భ్రాంతి రహితం కాదు.

పాప: ఆత్మస్వరూప సాక్షాత్కారముపొంది అదే తన నిజ రూపంగా గుర్తించి అంద్వైక్యముపొంది వానికి కూడా భ్రాంతిరహితం కాదుకదా?

తాత కాదు తల్లీ కాదు. భ్రాంతిమూలమును గుర్తించిన వాడే అయినాడు కాని అతడు భ్రాంతిరహితం చేరుకొనలేదుగదా?

పాప అన్నిటికి మూలమైన యీ యెరుక లేదని దృఢం చేసుకొనిన, సర్వకార్యములు చేస్తూ భ్రాంతీ లేక వున్నవాడే అశరీర అని అతని వునికేయే అశరీరపద్ధతి అనీ, అర్థమైంది. కాని అతడు చేసియే చేయనివాడు వుండియు లేనివాడు అన్నారు. అది యెట్లో అర్థం కాలేదు దృష్టాంతములు చెప్పితేకాని సందేహం తీరదు స్వామీ.

తాత: ఇదివరకు యెండమావుల దృష్టాంతం చెప్పినానుగా, నీవున్నట్టు తోచినా నీవులేదుగా, అనేక దృష్టాంతాలు చెప్పబడ్డాయి. ఒకటంకెవేసి దానికి వెనుక ప్రక్క సున్నాచుట్టితే ఒకటి వున్నట్లా లేనట్లా? వుండియున్న ప్పటికి లేనట్లేగదా భర్త లేని స్త్రీ యొక్క సౌంద

ర్యమూ అడవినిగాచిన వెన్నెల. యెవరి ఆనందము కొరకు వున్నట్టు? అవి వున్నప్పటికీ లేనిదానితో సమానమేగదా! వాని నవుడు ఏ కోరికలు బాధిస్తాయి. గొప్ప ఐశ్వర్యము వచ్చినట్లు కలగని మేల్కొన్న వానికి కలలో దోచిన కలిమి జాగ్రదవస్తలో ఏమైనా ఫలానుభవమునకు వచ్చునా? అట్లే గురుప్రబోధచే మేల్కొన్నవాడు బ్రతికియుండియు, చచ్చినవాడే సకల కార్యములు చేయుచునే వున్నా చేయనివాడే!

పాప: దృష్టాంతములు బాగానే వున్నాయి కాని నిప్పు లే లేదనుకొన్నా వుందనుకొన్నా చేయివేస్తే కాలదా స్వామీ!

తాత: అవునమ్మా! నిప్పు నిజంగా వున్నపుడు లేనేలేదను కొని చేయివేస్తే కాల్చదా మరి? పరిపూర్ణ పరబ్రహ్మ నందు నిజంగా యెరుక వుంటే నిప్పు కాల్చినట్లు కర్మాను భవమునకు కారణమౌతుంది. కాని నిజంగానే లేకపోతే ఎట్లా ఫలానుభవం కనుగుతుంది?

పాప: పరిపూర్ణమందు అసలు యెరుక లేనేలేకపోతే వున్న దని భ్రాంతిలో నున్నవాళ్ళనిమాత్రం ఎందుకు బాధి స్తుంది తండ్రీ?

తాత: చెట్టుపై నిజంగా భూతంలేదు. కాని వున్నట్టు అది తనమీదకు దూకినట్లు భయభ్రాంతులు చెందినవానినే

బాధిస్తుంది కాని ఎట్టి భయభ్రాంతులు పొందనివానిని బాధించదుగదా!

పాప: ధన్యోస్మి ఇపుడు సందేహ నివర్తి అయినది. ఆ అశరీరి ఎట్లా వుంటాడు? వాని ప్రవర్తన యెట్లావుంటుంది! కొంచెం తెలపీయండి స్వామీ!

తాత: వారితో వుంటేనవలె. వారు నడిచేటప్పుడు భోజనం చేసేటపుడు కూడావుండి గమనిస్తే తెలుస్తుందన్నారు దీక్షితులవారు.

పాప: ఐతే తమరు అశరీరులు కనుక తమతో వచ్చేస్తాను స్వామీ!

తాత: కొంపతీసేవు సుమా! నీవు వివాహం చేసుకున్నాక మీ వారితో కలసి వద్దువుగానిలే! అశరీరుని స్థితిని కృష్ణదాసుదారు వర్ణించినారుగా, చెప్తానిను.

పాప: చెప్పండిస్వామీ! అట్టి అశరీరుల వునికివిన్నా పుణ్యమే.

తాత: ఎరుక భ్రాంతియందున్న వానికి పుణ్యపాపాలు అంటుతాయి. ఎరుక విడచినవారికి పుణ్యపాపములు అంటవుగదా!

పాప: ఎందుచేత స్వామీ?

తాత! పుణ్యపాపాలు దేనికంటుకుంటాయో అట్టి అంతఃకరణాయే గురుకృపవలన లేకుండా చేసుకుంటే యిక దేనికంటుతవి?

పాప: ఒకదృష్టాంతం చెప్పండి స్వామీ!

తాత: యిల్లుకూలగొట్టే అందుండే ఎలుకలు పందికొక్కులు ఎక్కడుంటా?

పాప: అర్థమైనది తండ్రీ! మరి అశరీరి వునికి ఎట్లావుంటుందో చెప్పండి స్వామీ!

తాత: ఏ కార్యముచేసినా తాను కర్తగాదనే భావంలో వుంటాడు. ఫలాసక్తి లేకుండా కర్మలు చేస్తాడు. యిష్టా యిష్టములు (రాగద్వేషములు) వుండనే వుండవు దేని కోసము పరుగెత్తడు అట్లని కావలసిన పని సాధించు టకు కృషిచేయక మానడు సుఖదుఃఖములకు స్తుతి నిందలకు పొంగడు, క్రుంగడు.

పాప: అది యెట్లసాధ్యము తండ్రీ!

తాత: జంఝూమారుతము వీచినపుడు యిటూనటూ వూగిస లాడినా దర్భగడ్డికి వేళ్ళుపట్టు సడలదు. నదిపొంగి ముంచివేసినాప్రవాహం తగ్గేసరికి యథాప్రకారం నిలచి వుండును. అట్లనే అశరీరి అంతఃకరణ స్థిమితంమాత్రం యెన్నడూ వీడదు. భుక్తిముక్తిక్రియల రెంటియందునూ సంగముగాని అసంగముగాని యుండదు. పరిపూర్ణమే యున్నదని తానశరీరినని విర్రవీగడు. అనవసర ప్రసంగ ములు చేయక పరిపూర్ణత దనరుచుండును.

పాప: అట్టి అరూఢస్థితి నాకెన్నటికేనా వస్తుందా స్వామీ? ఎల్లా వస్తుందో స్వామీ తెలపీయండి.

తాత: ప్రథమంలో, తనతో సహా సర్వమూ గురుమయమనే భావన దృఢం కావాలి. యిందుకు గురుభక్తి, గురునిష్ఠా సాధనములు ఆపిదపగాని పూర్ణబోధ అలుకదు. అపుడు అశరీర పద్ధతి అప్రయత్నముగా సహజంగానే వృద్ధిచెందగలదు. చాలు యిక వెళ్ళివస్తాను.

పాప: ధన్యోస్మి (తాత పాదములకు మోకరించి నమస్కరించి) గురుమంత్రానుష్ఠానమును విడువక సర్వదా నిష్ఠయందుండి త్రికరణ శుద్ధిగా కాలక్షేపము చేస్తాను నన్ను రావద్దన్నరుగా! తమరే యీదీనురాలిని మరువక పదేపదే వచ్చి చూచి పోతూండండి స్వామి!

(యిరువురు నిష్క్రమింతురు)



ప్రాప్తిస్థానము

1. శ్రీ దయానంద రాజయోగీంద్రులవారు

నెం. 4-1-96 రాజయోగాశ్రమం

పాతబోయిన గూడా

సికింద్రాబాద్ 500 008.

అమ్మాజి

2. యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు

4 వ వార్డు. నర్సాపురం

ప.గో.జిల్లా. 534 275